హింపుము అని ప్రార్థించి శ్రీకృష్ణమూర్తిచేత అనుజ్ఞను పడసిన వాఁడై అచ్చటనుండిన జనులందఱు ఆశ్చర్యమును సంతోషమును పొందునట్లుగా దేవతలచేత పంపఁబడిన విమానముపైనెక్కి స్వర్గమునకుఁ బోయెను ఇక్కడ శ్రీకృష్ణమూర్తియు అచ్చటనుండిన రాజులకు అందఱకు ధర్మము తెలియునట్లుగా ఒకమాట చెప్పెను అని తాత్పర్యము.

౫౭౪.—సీ॥ నరనాథకులకాన ✽ నము దహించుటకును - నవనీసురుల విత్త ✽ మగ్నికీల
జననాయకుల నిజై ✽ శ్వర్యాబ్ధి నింకింప - బ్రాహ్మణ క్షేత్రంబు ✽ బాడబంబు
పార్థివోత్తముల సం ✽ పచ్ఛైలము లఁగూల్ప - భూసురధనము దం ✽ భోళిధార
జగతీవరుల కీర్తి ✽ చంద్రిక మాయింప - సూర్యోదయము ధరా ✽ సురుల ధనము

తే॥ విప్రతతి సొమ్ముకంటెను ✽ విషము మేలు। గరళమునకును బ్రతికృతి ✽ గలదుగాని
దానిమాన్పంగ భువిఁబా ✽ ధములు లేవు। గాన బ్రహ్మస్వములు గొంట ✽ గాదుపతికి.

టీ॥ నరనాథకులకాననముఁ—రాజులసమూహమనెడుఅడవిని. దహించుటకుఁ—కాల్చుటకు. అవనీసురులవిత్తము — బ్రాహ్మణుల ధనము. అగ్నికీల—నిప్పుమంట. జననా...అబ్ధిఁ — జననాయకుల—రాజులయొక్క. నిజ—స్వకీయమయిన. ఐశ్వర్య — కలిమియనెడు. అబ్ధిఁ—సముద్రమును. ఇంకింపఁ—ఇంకునట్లుచేయను. బ్రాహ్మణక్షేత్రంబు — బ్రాహ్మణులయొక్కపంటభూమి. బాడబంబు — బడబాగ్ని. పార్థివోత్తములసంపచ్ఛైలములఁ—రాజులయొక్క భాగ్యమనెడుకొండలను. కూల్పఁ—పడఁగొట్టుటకు. భూసురధనము—బ్రాహ్మణులధనము. దంభోళిధార — వజ్రాయుధపువాదర. జగతీవరులకీర్తిచంద్రికఁ—రాజులకీర్తియనెడువెన్నెలను మాయింపఁ—పోఁగొట్టుటకు. ధరాసురులధనము — బ్రాహ్మణులసొత్తు. సూర్యోదయము—ప్రాదుర్భావము. విప్రతతిసొమ్ముకంటెను—బ్రాహ్మణసమూహముయొక్క ధనముకంటెను. (విషము) మేలు—మంచిది. గరళమునకును—విషమునకుఁగూడ. ప్రతికృతి—ప్రతిక్రియ కలదుగాని—ఉన్నదిగాని. దానిఁ — ఆబ్రాహ్మణుల సొత్తు అనెడువిషమును. మాన్పంగఁ—పోఁగొట్టుటకు. భువిఁ—భూలోకమునందు. ఔషధములు—మందులు. (లేవు) కానఁ—కనుక. పతికిఁ—రాజైనవానికి. బ్రహ్మస్వములు — బ్రాహ్మణద్రవ్యములను. కొంట — తీసికొనుట. కాదు—తగదు. శ్లో॥ నవిషం విషమిత్యాహుః బ్రహ్మస్వం విషముత్తమం। విషమేకాకినంహంతి బ్రహ్మస్వంపుత్రపౌత్రకం॥

తా॥ రాజులనెడు అడవిని కాల్చుటకు బ్రాహ్మణులసొత్తు అగ్నియగును, రాజులయొక్క ఐశ్వర్యమనెడు సముద్రమును ఇంకిపోవునట్లు చేయుటకు బ్రాహ్మణుల పంటభూములు బడబాగ్నియగును, రాజుల కలిమియనెడు కొండలను అణఁగఁగొట్టుటకు బ్రాహ్మణుల ధనము వజ్రాయుధపు వాదరవంటిది అగును, రాజుల కీర్తియనెడు వెన్నెలను మాపివేయుటకు బ్రాహ్మణులసొత్తు అనునది సూర్యోదయము అగును కనుక బ్రాహ్మణులసొత్తుకంటె విషము మంచిది, విషమునకైన విఱుగుడుకలదుగాని బ్రాహ్మణులసొత్తునకు విఱుగుడులేదు కాఁబట్టి రాజైనవాఁడు బ్రాహ్మణులసొత్తును అపహరింపరాదు అని తాత్పర్యము.

౫౭౫.—కం॥ ఎఱుఁగమినైనను భూసుర। వరులధనం బపహరింప ✽ వలవదు పతికిన్
మఱపున ననలము ముట్టిన। దరికొని వెసఁ గాల్పకున్నె ✽ తనువెఱియంగన్.

టీ॥ పతికిన్ — రాజునకు. ఎఱుఁగమినైనను — అజ్ఞానముచేతనైనను. (లేక) తెలియకయైనను. భూసురవరులధనంబు—బ్రాహ్మణశ్రేష్ఠులసొత్తును. అపహరింపవలవదు—నాఁచుకొనుటకూడదు. మఱపునన్—జ్ఞప్తిలేకపోవుటచేత అనలముఁ — అగ్నిని. ముట్టినన్—తాఁకినను. దరికొని—పైనివ్యాపించి. వెసన్—శీఘ్రముగా. తనువు—దేహము. ఎరియంగన్—మండఁగా. కాల్పకున్నె—కాల్పక ఉండునా.

తా॥ రాజు పరాకుచేతనైన బ్రాహ్మణులసొత్తులను ముట్టరాదు ముట్టినపక్షమున ఏమఱితాఁకినను దేహము తపించునట్లుగా అగ్ని కాల్చునట్లు బ్రాహ్మణులసొత్తు కాల్చునని తాత్పర్యము.

వ॥ మఱియును దనధనంబు పరులచేతఁగోల్పడిన విప్రుండు దుఃఖంబున రోదనంబుసేయ నుఱిలిన యశ్రుకణంబుల వలన రేణువు లెన్నిదడిసె నన్నివేలేండ్లు దదుపేక్షాపరుండైనపతి దారుణ వేదనలుగల కుంభీపాకనరకంబు నొందు మఱియును గ్రిందటఁ బదితరంబులవారును, ముందటఁ బదితరంబులవారును, మహానరక వేదనలంబొందుదురు స్వదత్తంబైనఁ బరదత్తంబైన నర్థంబు లోభంబునుజేసి దుశ్శీలుండై భుజించు నప్పాపాత్ముండఱువదివేల సంవత్సరంబులు మలకూపంబునం గ్రిమిరూపంబున వర్తించు నట్లగుటనెఱింగి విప్రుం డెంతతప్పుచేసిన నెన్నిగొట్టిన నెన్నిదిట్టిననని యెదురుపలుకక వినయంబునవందనం బాచరించుపుణ్యాత్ములు నాదుపాలింటివారదియునుంగాక నేనుబ్రతిదివసంబును భూసురులనతివినయంబునఁబూజింతునిట్లుసేయక విపరీతవర్తనులైన తామసులనేవెదకి దండింతుననిగావునఁ బురజను బ్రాహ్మణజనంబులవలనం బరమభక్తిగలిగి మెలంగుండనియానతిచ్చి యాధవప్రకరంబులు సేవింప నఖిలలోకశరణ్యుండైన యప్పుండరీకాక్షుండు నిజనివాసంబునకుం జనియెనని చెప్పి శుకుం డిట్లనియె.

టీ॥ మఱియును—ఇదిగాక. (తనధనంబు) పరులచేతన్ = ఇత రులచేత. కోల్పడిన—పోఁగొట్టుకొన్న. విప్రుండు—బ్రాహ్మణుఁడు. దుఃఖంబునన్ = దుఃఖముతో. రోదనంబుసేయన్ = ఏడువఁగా. ఉరిలిన—రాలిన. అశ్రుకణంబులవలనన్—కన్నీళ్లవల్ల. రేణువులెన్ని తడియన్—ఎన్ని రేణువులుతడియునో. అన్నివేలేండ్లు = అన్ని వేల సంవత్సరములు. తదుపేక్షాపరుండు—ఆబ్రాహ్మణులవిషయమునందు ఉపేక్షచేయుటయందు మక్కువగలవాఁడు. అయినపతి—అయినట్టి రాజు. దారుణవేదనలు—భయంకరబాధలు. కల = కలిగిన. కుంభీ పాకనరకంబున్ = కుంభీపాకము అను నరకమును పొందున్ = పొందును. మఱియును = ఇంతేగాక. క్రిందటన్ = తనకుముందు. (పదితరంబులవారును) ముందటన్ = తనకుపిమ్మట. (పదితరంబుల వారును) మహానరకవేదనలన్—గొప్పనరకబాధలను.(పొందుదురు) స్వదత్తంబైనన్—తనచేతఇయ్యఁబడినదైనను. పరదత్తంబయినన్— ఇతరులచేతఇయ్యఁబడినదయినను. అర్థంబులోభంబునంజేసి—ధనము నందలిలోభముచేత. దుష్టులండై—దుష్టస్వభావముగలవాఁడై భుజించు నప్పాపాత్ముండు = అనుభవించునట్టి ఆపాపపుమనసుగలవాఁడు. (అఱువదివేలసంవత్సరంబులు) మలకూపంబునన్—మలముగలనూతి యందు. క్రిమిరూపంబునన్—నులిపురుగురూపముతో. వర్తించును— ఉండును. అట్లగుటన్—కాఁబట్టి. ఎఱింగి = ఈవిషయమును తెలిసి కొని. విప్రుండు—బ్రాహ్మణుఁడు. (ఎంతతప్పుచేసినను) ఎన్నికొట్టి నను—ఎన్నిదెబ్బలు కొట్టినను. ఎన్నితిట్టినను = ఎన్నితిట్లు తిట్టినను. అతనికిన్ = బ్రాహ్మణునికి. ఎదురుపలుకక = విరుద్ధముగా మాట లాడక. వినయంబునన్—అడఁకువతో. వందనంబాచరించుపుణ్యా త్ములు—నమస్కారముచేయునట్టిధర్మాత్ములు. నాదుపాలింటివారు— నాసంబంధులు అగువారు. (అదియునుంగాక నేను) ప్రతిదివసం బును—దినదినమును. భూసురులన్ = బ్రాహ్మణులను. అతివినయం బునన్ = మిక్కిలివినయముతో. పూజింతున్ = పూజచేయుదును. (ఇట్లుచేయక)విపరీతవర్తనులైన—అక్రమమయినసడవడిగలవారైన. తామసులన్—మూర్ఖులను. (నేనుపెడకే) దండింతున్ = శిక్షింతును అదిగావునన్ = కాఁబట్టి. (మీరలు) బ్రాహ్మణజనంబులవలనన్— బ్రాహ్మణులంగువారియెడల. పరమభక్తి = మేలైనభక్తి. (కలిగి) మెలంగుండు—వర్తింపుఁడు. (అని) అనతిచ్చి—సెలవిచ్చి. యాదవ ప్రకరంబులు—యాదవులగుంపులు. సేవింపన్—కొలువఁగా. అఖిల లోకశరణ్యుండు = ఎల్లలోకములకు రక్షకుఁడు. వినయప్పంతరీ కాక్షుండు = అయినట్టి అకృష్ణుఁడు. నిజనివాసంబునకున్ = తన యునికిపట్టునకు. చనియెన్—పోయెను. (అనిచెప్పిశుకుండిట్లనియెను)

తా॥ ఇదిగాక పరులచేత తన ధనము అపహరింపఁబడఁగా అదుఃఖమువలన ఏడ్చునట్టి బ్రాహ్మణుని కన్నీళ్లచేత భూమిలోని రేణువులు ఎన్నితడియునో అన్నివేలసంవత్సరములు అధనమునపహ రించినవారిని విచారించి దండింపక ఉపేక్షచేసిన రాజు కుంభీ పాకము అను నరకమునందుఁబడి బహువిధములైనబాధల ననుభ వించును, అంతమాత్రమేగాక వానికిముందు పదితరములవారును వెనుక పదితరములవారును అఫలమును అనుభవింతురు, తానిచ్చిన దానినైనను ఇతరులిచ్చిన దానినైనను బ్రాహ్మణునిసొత్తును ధనము వలనిలోభముచేత దుస్స్వభావముగలవాఁడై అనుభవించునో అటు వంటి పాపాత్ముఁడు అఱువదివేలయేండ్లు మలముగల నూతియందు నులిపురుగై పడియుండును కనుక ఈసంగతి తెలిసి బ్రాహ్మణుఁడు ఎంత తప్పుచేసినను కొట్టితిట్టిబాధించినను ఓర్చుకొని వినయముతో అతనికి మ్రొక్కునట్టి పుణ్యపురుషులు నాసంబంధులు అగుదురు అంతేకాదు నేనుగూడ ఎల్లప్పుడు బ్రాహ్మణులను మిక్కిలి వినయ ముతో పూజచేయుచుందును ఇట్లు చేయక విరుద్ధపు నడవడిగల వారైనమూర్ఖులను నేనుపెడకే శిక్షించుచుందునుకనుక మీరు బ్రాహ్మ ణులయందు మిక్కిలి భక్తిగలిగి మెలఁగవలసినది అనిచెప్పి శ్రీకృ ష్ణుఁడు యాదవులందఱు తన్ను కొలువఁగా తనయింటికిపోయెను అనిచెప్పి శుకమహర్షి పరీక్షిన్మహారాజుతో ఈమీఁదచెప్పఁబోవు రీతిగాఁ జెప్పెనని తాత్పర్యము.

శ్రు॥ బ్రాహ్మణోత్రైసర్వాదేవతాః, సర్వాభిర్లైనం దేవతాభి మద్ధరతి యావతీర్వైదేవతా, స్తాస్సర్వావేదవిదిబ్రాహ్మణేవసంతి, తస్మాద్బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్యో దివేదివేనమస్కుర్యా న్నాశ్లీలం కీర్తయే దేతాఏవదేవతాః॥ శ్రీణాం॥ అని శ్లో॥విప్రోఘదర్శనాత్సద్యః క్షీయంతేపాపరాశయః । వందనాన్మంగళావాప్తి రర్చనాదచ్యుతం పదం అని.

౫౨౭.—క॥ ఈకథఁ జదివినవారలు । గైకొని వినువారు విగత ✱ కలుషాత్మకులై
లౌకిక సౌఖ్యము నొందుదు । రాకైవల్యంబుఁ గరత ✱ లామలకముగన్.

టీ॥ (ఈకథను) చదివినవారలు = చదివినవారును. గైకొని = ఆదరించి. వినువారును—ఒకరు చదివిచెప్పఁగా విన్నవారును. విగత కలుషాత్మకులై—పోయినపాపములుగలవారై. లౌకికసౌఖ్యమున్— ఈలోకమునందుపొందఁగలసౌఖ్యములను. ఒందుదురు—పొందుదురు. ఆకైవల్యంబున్ = ప్రసిద్ధమైన ముక్తిస్థానమును. కరతలామలక ముగన్—అరచేతిలోనితిసిరికాయవలెఅతిసులభముగాలభించును.

తా॥ నృగమహారాజునకు కృష్ణుఁడు శాపవిముక్తిచేసిన యీకథను ఎవరు శ్రద్ధతో వినుదురో ఎవరు శ్రద్ధతో చదువుదురో అట్టి వారికి ఈలోకమునందలి సౌఖ్యములును సుఖముగా లభించును పిమ్మటపరమపదమును అతిసులభముగాలభించును అనితాత్పర్యము.

## విశేషార్థము.

టీ॥ నృగుఁడు—బ్రహ్మవేత్తయైన కృష్ణసందర్శనముచేత మరల మనుష్యజన్మమునుధరించినవాఁడు—పూర్వము దుర్లభమైన మనుష్య జన్మమెత్తియును బ్రహ్మజ్ఞానము లేక నివృత్తికర్మముచేసి అధోగతి పాలై తర్వాత బహుకాలమునకు బ్రహ్మవేత్తయైన కృష్ణసందర్శ నముచేత పూర్వజన్మమునుధరించి పుణ్యగతికిఁబోయెనుగనుక సకల జనులును సర్వసత్కర్మములనుచేసి అకర్మఫలమును బ్రహ్మార్పణము చేసినపక్షమున కర్మములుచేసియుచేయనివారేయై మోక్షసామ్రాజ్య మునుచెందుదురు, శ్లో॥ నివృత్తింకర్మసేవేత ప్రవృత్తింమత్పరస్త్య జేత్ । జిజ్ఞాసాయాంసంప్రవృత్తో నాద్రియేత్కర్మచోదనాం॥ అని భగవద్వాక్యము.



(*) బలరాముఁడు సుహృద్బంధుజనదర్శనార్థమై వ్రేపల్లెకుఁ బోవుట. (*)

౫౧౮.—సీ॥ నరనాథ వినుమొక * నాఁడు తాలాంకుండు - చుట్టాల బంధులఁ * జూడువేడ్క-
సుందర కాంచన * స్యందనారూఢుఁడై - భాసిల్లుచున్న వ్రే * పల్లె కరిగి
చిరకాలసంగత * స్నేహులై గోప గో - పాంగనా నికర మా * లింగనములు
సముచిత సత్కృతుల్ * సలుపఁగైకొని మనో - త్సుకలీల నంద య * శోదలకును

తే॥ వందనం బాచరించిన * వారు మోద | మంది బిగియారఁ గౌఁగిళ్ల * నొందఁ జేర్చి
సమత దీవించి యంక పీ * ఠములఁ జేర్చి | శిరము మూర్కొని చుబుకంబుఁ * గరము వ్రాలికి.

టీ॥ నరనాథ=ఓపరీక్షిన్మహారాజా. (వినుము) ఒకనాఁడు=ఒకానొకదినము. తాలాంకుండు=బలరాముఁడు. చుట్టాలన్ = మిత్రులను. బంధులన్=బంధుత్వముగలవారిని. చూడువేడ్కన్=చూడవలెనను కుతూహలముతో సుందర రూఢుఁడై—సుందర=అందమయిన. కాంచన=బంగారుమయమయిన స్యందన=రథమునందు. ఆరూఢుఁడై = ఎక్కినవాఁడై. భాసిల్లుచున్న=ప్రకాశించుచున్న వ్రేపల్లెకున్ = నందునిఘండకు. అరిగి = పోయి. చిరకాలసంగత స్నేహులు—చిరకాల = బహుకాలమునకు. సంగత = కూడిన. స్నేహులు = చెలిమిగలవారు. (ఐ) గోపగోపాంగనానికరము — గోప=గొల్లవాండ్రయొక్కయు గోపాంగనా=గోపికలయొక్కయు నికరము=సమూహము. ఆలింగనములు=కౌఁగిలింతలును. సముచిత సత్కృతులు=తగినమర్యాదలును. సలుపన్=చేయఁగా. కైకొని=అంగీకరించి. మనోత్సుకలీలన్=మనసునందలి తమకముచేతిని. (నంద యశోదలకును) వందనంబాచరించినన్=సమస్కారముచేయఁగా. వారు=ఆనందుఁడును యశోదయు. మోదమంది=సంతోషించి. బిగియారన్=గట్టిగా. కౌఁగిళ్లన్=సందిళ్లయందు. ఒందన్=పొందికగా. చేర్చి=పొందికగాను బిగువుగాను లోపల నానించి కౌఁగిలించుకొనియనుట. సమతన్=యుక్తరీతిచేత. దీవించి=ఆశీర్వదించి. అంకపీఠములఁ జేర్చి=ఒడులనుపీఠములయందుఁ జేర్చుకొని శిరము=తలను. మూర్కొని=మూఁచూచి చుబుకంబున్=గడ్డమును. కరము వ్రాలికి=మిక్కిలి పట్టిపట్టిచూచి

తా॥ ఓరాజా! ఒకనాఁడు బలరాముఁడు తనకు కావలసిన చుట్టములైన నందుఁడు మొదలగువారిని చూడవలెనని వ్రేపల్లెకు పోయి అందుఁగల గోపకులును గోపికలు బహుదినములకు బలరామునితోడి కూడిక కలిగెనని తమతమ చెలుములకుఁదగినట్లుఆలింగనములుచేసికొని మర్యాదలుచేయఁగా ఆమర్యాదలను అంగీకరించి నందునిని యశోదను నమస్కారము చేయఁగా వారుసంతోషించి కౌఁగిలించుకొని ఒడిలోకూర్చుండఁబెట్టుకొని యుక్తమయిన దీవనలిచ్చి తలనుమూర్కొని గడ్డమును పట్టిపట్టి చూచుచుననిరా.

వ॥ మఱియు నానందబాష్ప ధారాసిక్త కపోల యుగళంబులతోడం గుశలప్రశ్నంబుల నిట్లనిరన్నా నీవును
నీచిన్నితమ్ముండగు వెన్నుండును లెస్సయున్నవారె మమ్మెప్పుడు నరసి రక్షింపవలయు మాకు నేడు
గడయు మీరకాక యొరులు గలరే యని సముచిత సంభాషణంబులం బ్రొద్దు పుచ్చుచుండి రంత.

టీ॥ (మఱియును) ఆనంద ..తోడన్—ఆనంద = సంతోషము చేతఁగలిగిన బాష్ప=కన్నీళ్లయొక్క. ధారా=ధారలచేత. సిక్త=తడిసిన. కపోల=చెక్కిళ్లయొక్క. యుగళంబులతోడన్ = జంటలతో. కుశలప్రశ్నంబులన్ = క్షేమములు అడుగుటచేత. ఇట్లనిరి=ఇట్లుపలికిరి. అన్నా=నాయనా. (నీవును) నీచిన్నితమ్ముండగువెన్నుండును=నీప్రియుడయినతమ్ముఁడగుకృష్ణుఁడును. లెస్సయున్నవారె=బాగుగనున్నారా. (మమ్మును) ఎప్పుడును=ఎల్లప్పుడు. అరసి=విచారించి. రక్షింపవలయున్ = కాపాడవలయును. (మాకు) నేడు

గడయుర్—తల్లి తండ్రి చుట్టము చెలికాఁడు జ్ఞానము ధనము దాత ఆసేది యేడువిధములయిన రక్షకులును. శ్లో॥ త్వమేవమాతాచ పితాత్వమేవ త్వమేవబంధుశ్చ సఖాత్వమేవ। త్వమేవవిద్యాద్రవిణం త్వమేవ త్వమేవసర్వం మమదేవదేవ॥ అని. మీరకాక—మీరేకాక, ఒరులుగలరే — ఇతరు లెవరయినను ఉన్నారా. (అని) సముచిత సంభాషణంబులన్ — తగినమాటలచేత. (ప్రొద్దుపుచ్చుచుండిరి) అంతన్—అంతట.

తా॥ సంతోషమువలన కన్నులనుండి వచ్చు నీళ్లచేత తడిసిన చెక్కిళ్లు గలవారగుచు బలరాముని క్షేమము విచారించుమాటలుగా నిట్లుపలికిరి, అయ్యా నీవును నీతమ్ముఁడయిన శ్రీకృష్ణమూర్తియు క్షేమముగ నున్నారుగదా, మమ్ము ఎల్లప్పుడు విచారించి కాపాడ వలసినవారు మీరేకదా, మాకు తండ్రి దాత మొదలుగాఁగలయేడు విధములయినదిక్కును మీరేకాక యితరు లెవరున్నారు అని యిప్పటికి తగినమాటలచేత ప్రొద్దులు పుచ్చుచుండఁగానని తాత్పర్యము.

౫౩౦.—క॥ గోపాలవరులు ప్రమదం। బాపోవనివది నివర్తి ॥ తాఖిల గేహ
వ్యాపారులగుచు హలధరు। శ్రీపాదంబులకు నతులు ॥ సేసిరి వరుసన్.

టీ॥ గోపాలవరులు — గోపకులలో ముఖ్యులగువారు. ప్రమదంబు—సంతోషము. ఆపోవనివదిన్—తృప్తికాలనివనసులతో. నివర్తితాఖిలగేహవ్యాపారులగుచున్—విడువఁబడిన యెల్లయింటిపనులుగలవారగుచును—తమయిండ్లలో తాముచేసికోవలసినపనులన్ని వదలియనుట. హలధరుశ్రీపాదంబులకున్ — సంపత్కరములయిన బలరాముని అడుగులకు వరుసన్—క్రమముగా. నతులుసేసిరి — నమస్కారములుచేసిరి.

తా॥ అప్పుడు వ్రేపల్లెలోని గొల్లలలో ముఖ్యులగువారందఱు మేరమీరిన సంతోషములతో తమతమ యింటిపనుల నన్నిటిని విడిచి వచ్చి శ్రీబలరాముని అడుగులకు మ్రొక్కిరి అని తాత్పర్యము.

౫౩౧.—క॥ సీరియు వారికిఁ గరుణో। దారుండై నడపె సముచి ॥ తక్రియ లంతం
గోరి తనయీడు గోపకు। మారులఁ జేచఱచి బలుఁడు ॥ మందస్మితుఁడై.

టీ॥ సీరియున్—బలరాముఁడును. వారికిన్—ఆగొల్లలకు. కరుణోదారుఁడై—దయచేత కళంకములేనివాఁడై. సముచితక్రియలు — తగినమర్యాదలను. నడపెన్—చేసెను. అంతన్—పిమ్మట బలుఁడు—బలరాముఁడు. కోరి—అపేక్షించి (తనయీడుగోపకుమారులను) చేచఱచి—చేతులుతట్టి మందస్మితుఁడై — చిఱునవ్వుగలవాఁడై.

తా॥ అంతట బలరాముఁడును ఆనమస్కరించినవారికి తగిన సన్మానములుచేసి పంపి అందు తనయీడుగల గొల్లచిన్నవాండ్రను చేతులతో తట్టి చిఱునవ్వునవ్వెను అని తాత్పర్యము.

౫౩౨.—క॥ నిజసుందర దేహద్యుతి। రజతాచలరుచులఁ దెగడ ॥ రాముఁడు వారల్
భజియింప నేగి యొకచో। విజనస్థలమున వసించి ॥ విలసిల్లె నెడన్.

టీ॥ రాముఁడు—బలరాముఁడు నిజసుందరదేహద్యుతి—నిజ—తనదైన సుందర—అందమయిన. దేహద్యుతి—శరీరకాంతి రజతాచలరుచులన్ — వెండికొండకాంతులను తెగడన్ — తిరస్కరింపఁగా. వారలు — తనయీడుగలవారైన ఆగొల్లచిన్నవాండ్రు భజియింపన్—సేవింపఁగా. ఏగి—పోయి. విజనస్థలమునన్—ఇతరజను లెవరులేనికావున ఒకచోన్ — ఒకస్థలమునందు. వసించి — కూర్చుండి విలసిల్లెనెడన్ — మిక్కిలి సంతోషముతో నుండఁగా

తా॥ బలరామమూర్తి తన్నునమస్కారములుచేసినగొల్లలకెల్లను తగిన సన్మానములు చేసి వారిలో తన యీడువారైన గొల్లచిన్నవాండ్రను వెంటఁదీసికొని తనదేహకాంతులు వెండికొండకాంతులను మీరి వెలుఁగుచుండఁగా ఎవ్వరు లేని ఒక యేకాంతప్రదేశమునకుఁ బోయి కూర్చుండి వినోదముగా ప్రొద్దుపుచ్చుచుండఁగా నని తా

కవిరాజవిరాజితము. చరణములం గనకస్ఫుట నూపుర ॥ జాలము గల్లనుచుం గల కన్
గరములఁ గంకణముల్మొరయన్వలి ॥ గొనసియాడఁ గుచాగ్రములన్
సరులు నటింపఁ గురుల్గుని యన్నల ॥ సన్మణి కుండల కాంతులు వి
స్ఫురిత కపోలములన్ దొరయన్ వ్రజ ॥ సుందరు లందఱు మందగతిన్.

టీ॥ చరణములన్ — పాదములయందు. కనకస్ఫుటనూపుర జాలము — బంగారువైన ప్రకాశించునట్టి యందెలసమూహము. గల్లనుచున్ — గల్లనుకొట్టుటచేత చెలఁగన్—మ్రోఁగఁగా. కరములన్—చేతులయందు. కంకణములు—కడియములు. మొరయన్—మ్రోఁగఁగా. వలిగొనసు—సూక్ష్మమైననడుములు ఆసియాడన్—చలింపఁగా. కుచాగ్రములన్—స్తనములమీఁద. సరులు—మెడలోని హారములు. నటింపన్—అల్లలాడుచుండఁగా కురులు—తలవెండ్రుకలు. గునియన్—కదలాడుచుండఁగా. విలసన్మణికుండలకాంతులు—ప్రకాశించుచున్న రత్నములుపొదిఁగినచెవులలోని కమ్మలకాంతులు. విస్ఫురితకపోలములన్ — మెఱుఁగులు దేఱుచున్న చెక్కిళ్లయందు, దొరయన్—వ్యాపింపఁగా. వ్రజసుందరులు—గోపికాస్త్రీలు. (అందఱును) మందగతిన్—మెల్లనినడతో.

తా॥ గోపికాస్త్రీలు పాదములయందలి అందెలును చేతులలోని కడియములును గలగలమ్రోఁగుచుండఁగా, నడుములు ఆసియాడుచుండఁగా, రొమ్ములందు హారములు చలింపఁగా, తలవెండ్రుకలు కూలాడుచుండఁగా, చెవులలోని రత్నములకమ్మలకాంతులు మెఱుఁగులు దేఱుచున్న చెక్కిళ్లయందు వ్యాపించుచుండఁగా, మిన్నగానడచుచునని తాత్పర్యము.




(✽) బలరామునితో గోపికలు సంభాషించుట. (✽)

కవిరాజవిరాజితము॥ చని బలభద్రుని శౌర్యసముద్రుని ✽ సంచిత పుణ్యు నగణ్యునిఁ జం
దన ఘనసార పటీర తుషార సు ✽ ధారుచికాయు విధేయు సుధా
శన రిపు ఖండను సన్మణి మండను ✽ సారవివేకు నశోకు మహా
త్మునిఁ గని గోపిక లోపిక లేక య ✽ దుప్రభు నిట్లని రుత్కలికన్.

టీ॥ చని — ఆయేకాంతప్రదేశమునకు బోయి. శౌర్యసముద్రునిన్ — అధికశూరత్వముగలవాఁడును. సంచితపుణ్యున్ — కూర్పఁబడినపుణ్యముగలవాఁడును. అగణ్యునిన్ — (యతోవాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ) అను శ్రుతివలన మనస్సుచేత ఇట్టివాఁడని యూహించుటకును, వాక్కుచేత నిట్టివాఁడని పొగడుటకును సాధ్యముకానివాఁడును. చందన...కాయున్ — చందన — మంచిగంధము యొక్కయు. ఘనసార — కర్పూరము యొక్కయు. పటీర - మంచి గంధపుపూఁత యొక్కయు. తుషార — మంచు యొక్కయు. సుధా — అమృతము యొక్కయు. రుచి — కాంతివంటి కాంతిగల. కాయున్ — శరీరముగలవాఁడును — శుద్ధ సత్త్వమయ దేహము గలవాఁడనుట. విధేయున్ — అణఁగినవాఁడును. సుధాశనరిపుఖండనున్ — దేవశత్రువులైన రాక్షసులను చంపువాఁడును — లేక, బ్రహ్మానంద మనెడి అమృతమును పానము చేయునట్టి బ్రహ్మవేత్తలయందు పగగల కర్ములను అథోగతిపాలు చేయువాఁడును. సన్మణిమండనున్ — మంచిరత్నాభరణములు గలవాఁడును — లేక, సత్ — సత్పురుషులనెడు. మణిమండనున్ — రత్నాలంకారములుగలవాఁడు — సత్పురుషులచేత సేవింపఁబడువాఁడనుట. సారవివేకున్ — సారమైన తెలివిగలవాఁడును. లేక, అపరోక్షజ్ఞానస్వరూపుఁడును. అశోకున్ — నిత్యానందుఁడగుటచేత — శోకము లేనివాఁడును. మహాత్మునిన్ — గొప్పశరీరముగలవాఁడును — విరాట్స్వరూపుఁడనుట. యదుప్రభున్ — యదువులకు రాజయిన — లేక, బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుఁడైన. బలభద్రునిన్ — బలరాముని. కని — చూచి గోపికలు — గోపస్త్రీలు — లేక, బ్రహ్మవిచారపరులనెడు గోపికలు. ఓపిక లేక — తాలిమిలేక. ఉత్కలికన్ — తమకముచేత. ఇట్లనిరి — ఇట్లు పలికిరి.

తా॥ శూరత్వముచేత పరిపూర్ణుఁడును, పుణ్యసంపాదకుఁడును, ఎన్నరానివాఁడును, మంచిగంధము కర్పూరము మంచి గంధపు పూఁత మంచు అమృతముఁ బోలిన తెల్లనైన దేహకాంతిగలవాఁడును, భక్తులకు అణఁగినవాఁడును, దేవశత్రువులయిన రాక్షసులను చంపువాఁడును, మంచిరత్నములు చెక్కిన ఆభరణములు గలవాఁడును, సారమయిన తెలివిగలవాఁడును, దుఃఖము లేనివాఁడును, గొప్పమనసు గలవాఁడును నైన బలభద్రుఁడున్నచోటికిఁ బోయి ఆయనను జూచి తాలిమి లేనివారై గోపికాస్త్రీలు తమకముతో కృష్ణమూర్తినుద్దేశించి యిట్లు పలికిరని తాత్పర్యము.

౫౩౫.—చ॥ హలధర నీసహోదరుఁ డు ✽ దంచిత కంజవిలోచనుండు స
ల్లలిత పురాంగనాజన వి ✽ లాస విహార సమగ్ర సౌఖ్యముల్
గలిగి సుఖించునే మము ని ✽ కామక వేళనయేని బుద్ధిలోఁ
దలఁచునొ నూతనప్రియులఁ ✽ దార్కొని యేమియుఁ బల్కకుండునో.

టీ॥ హలధర — ఓబలరాముఁడా. నీసహోదరుఁడు — నీతోడఁ బుట్టినవాఁడును ఉదంచితకంజవిలోచనుండు — మిక్కిలి యొప్పిదమయిన కమలములవంటి కన్నులుగలవాఁడునైనకృష్ణుఁడు. సల్లలిత . . సౌఖ్యములు — సత్ — శ్రేష్ఠమైన. లలిత — మనోజ్ఞమైన. పురాంగనాజన — పట్టణపుస్త్రీజనులయొక్క. విలాస — వినోదకరమమైన. విహార — సంచారములవలని. సమగ్ర — కొంచెము లేని. సౌఖ్యములు — సుఖములు. కలిగి — కలవాఁడై. సుఖించునే — సుఖముగనున్నాఁడా. ఏకాకవేళనయేని — ఏదైన ఒకవేళలోనైన. మమున్ — మమ్మును. బుద్ధిలోన్ — తనతలంపునందు. (తలఁచునో) నూతనప్రియులన్ — క్రొత్తవారైనప్రియురాండ్రను. తార్కొని — కలసి. ఏమియుఁబల్క

గదయుగ — తల్లి తండ్రి చుట్టములను చెప్పకయే యుండుగా. ఆనాటి యేమునిభమ్మ... వితాత్యమువ త్వ... యున శ్రీకృష్ణమూర్తి మిక్కిలి త్యాకువ త్యేమవ... ములోని అందుపదుములలోడి వినోద ములలోఁదగిలి చక్కగాసుఖమును అనుభవించుచున్నాఁడా ఆసుఖములలో చొక్కుచు నుండుటచేత ఎప్పుడైనను ఒకతేర మమ్ము తలఁచునో తలఁపఁడో అసంగతి తెలియఁ దెలిసియున్నరొండల మాకు తెలియఁజెప్పుమని తాత్పర్యము.

ఒరులుగలరే — ఇ...కీ॥ జననీజనకుల ననుజాలఁ । దనుజాల బంధువుల మిత్ర ✱ తతివిడి యెపుడుక్
సంభాషణంబులక
అంతక — ...మనముల నొందు దలంపక । తననమ్మినవారి విడుటఁ ✱ దగునే హరికిక్.

...— కృష్ణునికి. జననీజనకులక — తల్లిదండ్రులను. అనుజక — తమ్ములను. తనుజాలక — కొడుకులను. బంధువులక — చుట్టములను. మిత్రతతిక — చెలికాండ్రసమూహమును. విడి — విడిచి. ఎపుడుక — ఎల్లప్పుడును. మనములక — మనసులలో. ఒండు — ఇతరమును. తలంపక — ఎంచక. తనునమ్మినవారిక — తన్నునమ్మియున్న వారిని — గోపికాస్త్రీలననుట. విడువఁదగునే — విడిచిపెట్టవచ్చునా.

తా॥ తల్లిదండ్రులు అన్నదమ్ములు బిడ్డలు చుట్టములు స్నేహితులు మొదలైనవారిని అందఱినివిడిచిపెట్టి తన్నేయెల్లప్పుడు మనసులలో ధ్యానించుచు ఇతరచింతలేనివారమైన మమ్ము విడిచిపెట్టుట శ్రీకృష్ణునికి న్యాయమాయని తాత్పర్యము.

౫౩౭.—సీ॥ సలలిత యామున ✱ సైకత స్థలమున - నుండి మమ్మేమని ✱ యూరడించె
విమలబృందావన ✱ వీథి మాదుఋకముల్ - వుడుకుచు నేమని ✱ బుజ్జగించెఁ
బువ్వవాటికలలోఁ ✱ బొల్చు మాకుచయుగ్మ - మంటుచు నేమని ✱ యాదరించెఁ
గాసారముల పొంత ✱ గాఁగిటముమఁజేర్చి - నయమొప్ప నేమని ✱ నమ్మఁబలికె

తే॥ నన్నియును మఱచెఁ గాఁబోలు ✱ వెన్నుఁడాత్మ । గోరి తొలాయలగువారిఁ ✱ గేరివిడుచు
నట్టి కృష్ణుఁడు తమ బట్టు ✱ పెట్టు ననక । యేల నమ్మిరి పురసతుల్ ✱ వేల లగుచు.

టీ॥ సలలిత ... స్థలమునక — సలలిత — మనోజ్ఞమయిన. యామున — యమునానదిలోని. సైకతస్థలమునక — ఇసుకదిబ్బల మీఁదను. (ఉండి మమ్ము) ఏమనియూఱడించెను — ఏమిచెప్పియూఱట కలుగఁజేసెను. విమల వీథిక — విమల — నిర్మలమయిన. బృందావనవీథిక — బృందావనప్రదేశమునందు. మాదుఋకములు — మాగడ్డములను. వుడుకుచుక — నొక్కినొక్కిపట్టుచు. ఏమనిబుజ్జగించెక — ఏమిచెప్పిలాలించెను పువ్వవాటికలలోక — పువ్వుతోఁటలలో. పొల్చు — ఒప్పునట్టి. మాకుచయుగ్మము — మా స్తనములజంటను. అంటుచుక — ముట్టిచూచుచు ఏమనియాదరించెక — ఏమిచెప్పి యోదార్చెను. కాసారములపొంతక — సరస్సులపెంబడి. కౌఁగిటముమఁజేర్చి — మమ్ముకౌఁగిలించుకొని. నయమొప్పక — తిన్నఁదనము ఒప్పుచుండఁగా. ఏమనినమ్మఁబలికెక — ఏమిచెప్పి నమ్మించెను. వెన్నుఁడు — కృష్ణుఁడు. (అన్నియును) మఱచెఁగాఁబోలుక — ఇప్పుడు మఱచిపోయినాడో యేమోకదా. ఆత్మక — మనసునందు. గోరి — ఆపేక్షించి — వలచి తొలాక — తాను. జాయలగువారిక — ప్రియురాండ్రగువారిని. గేరి — పరిహసించి. (విడుచునట్టికృష్ణుఁడు) తమబట్టుక — తమ్మును. బట్టుపెట్టుననక — అల్లరిచేయునని యెంచక. పురసతులు — పట్టణస్త్రీలు. వేలలగుచుక — పిచ్చివాండ్రయి. (ఏలనమ్మిరి)

తా॥ మనసునకు ఇంపుపుట్టించునట్టి యమునానదిలోని యిసుకదిబ్బలలో నుండునప్పుడు మమ్ము ఊఱడించినవిధమును, నిర్మలమైన బృందావనప్రదేశమునందు మమ్ము గడ్డములు పుణుకుచు లాలించిన విధమును, పువ్వులతోఁటలలో మా స్తనములంటుచు ఆదరించినవిధమును, సరస్సులతీరములందు మమ్మును కౌఁగిలించుకొనుచు నమ్మకపు మాటలు చెప్పినవిధమును, ఇప్పుడు కృష్ణుఁడు మఱచిపోయినట్టున్నది అట్లు తన్నునమ్మిన ప్రియురాండ్రను పరిహాసముచేసి విడిచిపెట్టునట్టిస్వభావముగలకృష్ణమూర్తిని ఆపట్టణములోని యిల్లాండ్రు ఎట్లునమ్మినారు, వారు ఎంతపిచ్చివారో కదాయని తాత్పర్యము.

౫౩౮.—మ॥ అని యిబ్బంగి సరోజలోచనుని న ✱ ర్మాలాపముల్ నవ్వులుక్
ననుబంధుల్ పరిరంభణంబులు రతి ✱ వ్యాసంగముల్ భావముల్
వినయంబుల్ సరసోక్తులుం దలఁచి యు ✱ ద్విగ్నారు చిత్తంబులక్
జనితానంగ శరాగ్నిచేత దురవ ✱ స్థం బొంది శోకించిరక్.

టీ॥ (అని) ఇబ్బంగిక — ఈవిధముగా. సరోజలోచనుని — కృష్ణుని యొక్క. నర్మాలాపములు — ప్రియవాక్యములును. నవ్వులుక — నవ్వుకొనుటలును. అనుబంధులు — చేరియుండుటలును. పరిరంభణంబులు — కౌఁగిలింతలును. రతివ్యాసంగములు — కలయికల యులవాటులును. భావములు — తలఁపులును. వినయంబులును — సరసోక్తులును — సరసపు మాటలును. తలఁచి — తలఁచుకొని. ఉద్విగ్నారుచిత్తంబులక — తమక పడునట్టిమనసులతో. జనితానంగశరాగ్నిచేతక — అప్పుడుపుట్టిన మన్మథునిబాణములవలని అగ్నిచేత — మన్మథతాపముచేత. దురవస్థక — సంకటమును. (పొంది) శోకించిరక — దుఃఖింపఁగా.

తా॥ అని యీరీతిగా గోపికలు ముందు కృష్ణుఁడు తమతోడల నడచిన ప్రియముతోడి ముచ్చటలు నవ్వుకొనుటలు సంబంధములు

స్యందనంబునన్ = అనుపట్టి అందమైనరథమునందు. పటుజవతురంగంబులన్ = మిక్కిలి వేగముగల గుఱ్ఱములను. పూన్చి = కట్టి. దారుకుండు = దారుకుఁడు అను పేరుగలసారథి. తెచ్చినన్ = తోలుకొని రాఁగా. (ఎక్కి) అతిత్వరితగతిన్ = మిక్కిలివడిగలనడతో. కాశికానగరంబునకున్ = కాశీపట్టణమునకు. అరిగినన్ = పోఁగా. పౌండ్రకుండును = పౌండ్రకవాసుదేవుఁడును. రణోత్సాహంబు = యుద్ధప్రయత్నము. దీపింపన్ = ప్రకాశింపఁగా. అక్షౌహిణీద్వయంబుతోడన్ = రెండు అక్షౌహిణులసేనతో. పురంబువెడలెన్ = పట్టణమునుండిబయలుదేరెను. (అప్పుడు) అతనిమిత్రుండు = వానిస్నేహితుఁడు. (ఐన) కాశీశాధిపతియును = కాశీరాజును. మూడక్షౌహిణులతోడన్ = మూడక్షౌహిణులసేనతో తోడుపడువాఁడై = సహాయుడువాఁడై. వెడలెన్ = బయలుదేరెను. (ఇట్లు) ఆప్తయుతుఁడై = మిత్రునితోఁగూడినవాఁడై. వచ్చువానిన్ = వచ్చునట్టిఆపౌండ్రకుని.

తా॥ అంతట కృష్ణుఁడు యుద్ధయాత్ర చేయవలెననుపూనికగలవాఁడై అనేకవిధములయిన ఆయుధములను, నానావర్ణములు గలిగి వెలుఁగునట్టి ఱెక్కపుగుడ్డలతోఁగూడిన బంగారుధ్వజస్తంభములును గలదై మిక్కిలి వడిగల గుఱ్ఱములనుగట్టిన అందమయినరథమును దారుకుఁడు తీసికొనిరాఁగా దానిపైనెక్కి అతిత్వరితముగా కాశీపట్టణమునకుపోయెను అంతలో అక్కడ పౌండ్రకవాసుదేవుఁడును మూడు అక్షౌహిణులదండుతో కాశిరాజు తోడుపడఁగా రెండు అక్షౌహిణుల సేనను గూర్చుకొన్నవాఁడై పట్టణమునుండి వెడలెను ఈవిధముగా స్నేహితునితోడ బయలుదేఱివచ్చుచున్న పౌండ్రకుని అని తాత్పర్యము.



(శ్రీ) శ్రీకృష్ణమూర్తి పౌండ్రకవాసుదేవునిమీఁదదండెత్తి వానింజంపుట. (శ్రీ) — కాశిరాజు.

౧౬౦.—సీ॥ చక్ర గదా శంఖ * శార్ఙ్గాదిసాధనుఁ - గృత్రిమ కౌస్తుభ * శ్రీనివాసు
మకరకుండల హార * మంజీర కంకణ - మణిముద్రికా వన * మాలికాంకుఁ
దరళవిచిత్ర ప * తంగ పుంగవ కేతుఁ - గెలువొందు పీతకా * కేయవాసు
జవనాశ్వకలిత కాం * చన రథారూఢుని - రణకుతూహలుని స * న్నదకేళు

